1185

ఓం నమో వీరబ్రహ్మణే

# బ్రహ్మం గారి కళ్యాణమ్

క్రియాసహితమ్ ఏకాహ్నికమ్



ధ్యానమ్

ఓం జ్ఞానరూపాయ విద్మహే । శివతత్వాయ ధీమహి।
తన్నో వీరబ్రహ్మః ప్రచోదయాత్॥

రచన

కీ॥శే॥ శ్రీ పామర్తి నాగభూషణశర్మ గారు
వేదాగమ సంస్కృత పండితులు

ప్రకటితమ్
వారి కుమార్తె రావూరి సూర్యకుమారి
భాషాప్రవీణ

ఓం నమో వీరబ్రహ్మణే

# బ్రహ్మం గారి కళ్యాణమ్

క్రియాసహితమ్ ఏకాహ్నికమ్



ధ్యానమ్

ఓం జ్ఞానరూపాయ విద్మహే। శివతత్వాయ ధీమహి।
తన్నో వీరబ్రహ్మః ప్రచోదయాత్॥

రచన

కీ॥శే॥ శ్రీ పామర్తి నాగభూషణశర్మ గారు
వేదాగమ సంస్కృత పండితులు

ప్రకటితమ్
వారి కుమార్తె రావూరి సూర్యకుమారి
భాషాప్రవీణ

## ఉదయం ఆలయమునకు తోరణములు

పెండ్లి పందిరికి ఆలయద్వారములకు తోరణములు ఉదయంపూట మంగళవాద్యములతో ఈశాన్యమున మొదలు పెట్టి కట్టవలయును.

## కళ్యాణ దంపతులు మంగళస్నానములు

స్థలశుద్ధిచేసి ముగ్గులు పెట్టి పీటలువేసి కళ్యాణము చేయు దంపతులు కూర్చుండి ముత్తైదువులచేత మంగళహారతి ఇప్పించుకొని మంగళస్నానములుచేసి పట్టుపంచలు కట్టుకొని గుడిలో స్వామికి నమస్కరింపవలయును.

## ఉత్సవ విగ్రహములకు మంగళస్నానములు

స్థలశుద్ధిచేసి పీటముగ్గులువేసి పీటలను రెండింటిని వేసి వాటిమీద ప్రాఙ్ముఖముగా బ్రహ్మంగారి గోవిందమ్మ గారి విగ్రహములను ఉంచి మంగళవాద్యములతో మంగళహారతులిచ్చి నమస్కరించి మంగళస్నానములు చేయించవలెను. ఈ కార్యక్రమం ఉదయం జరుపవలయును.

మధ్యాహ్నం గుడిలో పూజలుచేసి నివేదనలు చెల్లించి తీర్థప్రసాదములు స్వీకరింపవలయును.

## రాత్రికి కళ్యాణ కార్యక్రమము

రాత్రికి సుముహూర్తమునకు ముందుగా మంగళవాద్యములతో ఆలయములో ఈశాన్యభాగమున స్థలశుద్ధిచేసి ముగ్గులుపెట్టి

మంటపారాధనకు అలంకరించిన పెద్దపీటవేసి దానిమీద వస్త్రం పఱచి, బియ్యంపోసి మధ్యలో పంచకోణమండలం వేసి మధ్యలో ఓంకారమును లిఖించి, చుట్టును అయిదు తమలపాకులను పఱచి అలంకరించిన బ్రహ్మకలశమును ఉంచి అయిదు ఆకులలో వక్కలు ఖర్జూరకాయలు డబ్బులు ఉంచి, అష్టదిక్కులయందు 8 తమలపాకులు వేసి వాటిమీద వక్కలు ఖర్జూరకాయలు కానుకలు ఉంచవలయును. కలశమునకు వెనుక బ్రహ్మంగారి కళ్యాణపటమును ఉంచి బొట్టుపెట్టి పూలదండ వేయవలయును.

## అఖండ దీపారాధన

ఈశాన్యమున ముగ్గువేసి విస్తరివేసి ధాన్యం పోసి అలంకరించిన రెండు మూకుళ్లను ఉంచి నూనెపోసి వత్తులువేసి సిద్ధముగా నుంచవలయును.

## కళ్యాణ దంపతులు పీటలమీద కూర్చుండుట

తరువాత కళ్యాణ దంపతులు పెద్దలకు నమస్కరించి పీటలమీద ప్రాఙ్ముఖముగా కూర్చుండవలయును.

## దంపతులు పెద్దల ఆశీర్వాదము పొందుట

దంపతులు తాంబూలములు తీసికొని నిలుచుండి బ్రహ్మాది దేవతలకు నమస్కరించి పెద్దల ఆశీర్వాదమును పొంది కూర్చుండ వలయును.

ఘంటానాదము చేయవలయును

ఆగమార్థంతు దేవానాం । గమనార్థంతు విరోధినామ్ ।
కుర్యాత్ ఘంటారవంతత్ర । దేవతాహ్వాన లాంఛనమ్ ॥

ఉదకము ప్రోక్షించుకొనవలయును

అపవిత్రః పవిత్రోవా। సర్వావస్థాం గతోఽపివా ।
యస్మరేత్ విశ్వకర్మాణం । స బాహ్యాఽభ్యంతరశ్శుచిః॥

ఆచమనము చేయవలయును

ఓం వీరబ్రహ్మణేస్వాహా
ఓం వీరనారాయణ స్వాహా
ఓం వీరాధివీరాయస్వాహా
ఓం సనాతనాయ నమః
ఓం జ్ఞానబోధకాయ నమః
ఓం శుద్ధతత్వాయ నమః
ఓం సాత్వికాయ నమః
ఓం నిర్మలాత్మనే నమః
ఓం భేదవర్జితాయ నమః
ఓం సమతత్వాయ నమః
ఓం తపోనిష్ఠాయ నమః
ఓం కామవర్జితాయ, నమః
ఓం సర్వసంగపరిత్యాగినే నమః
ఓం అరిషడ్వర్గరహితాయ నమః
ఓం శరణాగతవత్సలాయ నమః
ఓం శాశ్వతాయ నమః
ఓం శుద్ధవిగ్రహాయ నమః
ఓం సిద్ధభక్తాయ నమః
ఓం త్రిగుణాతీతాయ నమః
ఓం రాజయోగినే నమః
ఓం కందిమల్లయవాసినే నమః
ఓం సమాధినిష్ఠా ప్రాప్తాయ నమః
ఓం సర్వపూజితాయ నమః
ఓం ధ్యానగమ్యాయ నమః

## అక్షతలను వెనుక నుంచుకొనవలయును

అపసర్పంతు యే భూతాః । యే భూతా భూమిసంస్థితాః ।
యే భూతా విఘ్నకర్తారః । తే సర్పంతు శివాజ్ఞ యా ॥

## ప్రాణాయామము చేయవలయును

ఓం ప్రణవస్య పరబ్రహ్మఋషిః । పరమాత్మా । దేవతా । దేవీ గాయత్రీఛందః । ప్రాణాయామే జపే వినియోగః। ఓం భూః ఓం భువః ఓగ్ం సువః ఓం మహః ఓం జనః ఓం తపః ఓగ్ం సత్యమ్ । ఓం తత్సవితుర్వరేణ్యం । భర్గోదేవస్య ధీమహి । ధియో యోనః ప్రచోదయాత్। ఓమాపోజ్యోతి రసోఽమృతం బ్రహ్మభూర్భువస్సువరోమ్।

## సంకల్పము చేయవలయును

శుభే శోభనే ముహూర్తే । శ్రీమహాబ్రహ్మాజ్ఞయా ప్రవర్తమానస్య। అద్యబ్రహ్మణః। ద్వితీయ ప్రహరార్ధే । కశ్యపబ్రహ్మకల్పే । వైవస్వత మన్వంతరే । కలియుగే । ప్రథమపాదే...। జంబూ ద్వీపే । భరతవర్షే భరతఖండే । మేరోః దక్షిణ దిగ్భాగే। శ్రీశైలస్య ఈశాన్య ప్రదేశే। కృష్ణా కావేర్యోః మధ్యప్రదేశే । అస్మిన్ వీరబ్రహ్మేంద్రస్వామి ఆలయే। సమస్త దేవతా బ్రాహ్మణ సన్నిధౌ ।

అస్మిన్ వర్తమాన వ్యావహారిక చాంద్రమానేన... సంవత్సరే... అయనే... ఋతౌ... మాసే ।... పక్షే... తిథౌ... వాసరే... నక్షత్రే... యోగే... కరణే। ఏవంగుణ విశేషణ విశిష్టే । అభ్యుదయ ముహూర్తే।

శ్రీమతః గోత్రస్య నామధేయస్య ధర్మపత్నీ సమేతస్య మమ సకుటుంబస్య। సభాతృకస్య। సబాంధవస్య అస్మిన్ గ్రామే స్థితానాం సర్వేషాం మహాజనానాం చ క్షేమస్థైర్య విజయ అభయ ఆయురారోగ్య సిద్ధ్యర్థం। ధర్మార్థ ఐశ్వర్య కామమోక్ష పంచవిధ పురుషార్థ సిద్ధ్యర్థం। శిశు పశు ధన ధాన్య సస్యసమృద్ధ్యర్థం। భక్తిజ్ఞాన వైరాగ్య సిద్ధ్యర్థం। అతివృష్టి అనావృష్టి ఇత్యాది ఈతి బాధా నివృత్యర్థం। బ్రహ్మాది సమస్తదేవతా ప్రసాద సిద్ధ్యర్థం। గోవిందమాంబా సమేత శ్రీ వీరబ్రహ్మేంద్రస్వామి అనుగ్రహ ప్రాప్త్యర్థం శ్రీ వీరబ్రహ్మేంద్ర కళ్యాణాఖ్యం కర్మ కరిష్యమాణః తదంగత్వేన

తదాదౌశుద్ధ్యర్థం వృద్ధ్యర్థం శాంత్యర్థం అభ్యుదయార్థంచ మహాజనైస్సహ స్వస్తిపుణ్యాహవాచనం కరిష్యే। ఆదౌనిర్విఘ్నేన పరిసమాప్త్యర్థం శ్రీ మహాగణాధిపతి పూజాం కరిష్యే। తదంగ కలశారాధనం కరిష్యే॥

## కలశపూజను చేయవలయును

కలశమును గంధాక్షతలతో పూజించి, "కలశస్య శివః పూర్వే..." అని ప్రార్థించి, "ఓం ఆపోవా ఇదగ్ం సర్వం విశ్వాభూతాన్యాపః" జలప్రార్థనచేసి, గంగేచ యమునే కృష్ణే అని సర్వనదీజలములను ప్రార్థించుచు తమలపాకుతో జలమును ముమ్మారు కదిలించి ఆ జలమును "ఆయాంతు మమ దురితక్షయ కారకాః। శ్రీ మహాగణాధిపతి పూజార్థం కలశోదకేన పూజాద్రవ్యాణి సంప్రోక్ష్య। దేవం ఆత్మానంచ సంప్రోక్ష్య"।

## గణపతిపూజ చేయవలయును తరువాత పుణ్యాహవాచన చేయవలయును

పుణ్యాహజలమును కర్తలమీదను ఉత్సవవిగ్రహముల మీదను అంతటను ప్రోక్షించి దిఙ్మార్జన చేసి పుణ్యాహవాచన దక్షిణను స్వీకరింపవలయును.

## తరువాత కర్తలకు మూర్తులకు కంకణధారణ చేయవలయును

"ఓం విశ్వేత్తాతే సవనేషు ప్రవాచ్యాయా చ కర్ధమఘవన్నింద్ర సున్వతే। పారావతం యత్పురు సంభృతం వస్వపావృణో శరభాయర్షి బంధవే" అని పురుషులకు.

"ఓం బృహత్సామక్షత్ర బృద్వృద్ధ వృష్ణియం। త్రిష్టు భౌజస్సుభిత ముగ్రవీరం ఇంద్రస్తోమేన పంచదశేన మధ్య మిదంవా తేన సగరేణ రక్ష" అని స్త్రీలకు-

## యజ్ఞోపవీతములు కర్తలు ధరించి మూర్తులకు ధరింపచేయవలయును

ఓం యజ్ఞోపవీతం పరమం పవిత్రం ప్రజాపతే ర్యత్సహజం పురస్తాత్। ఆయుష్య మగ్ర్యం ప్రతిముంచ శుభ్రం యజ్ఞోపవీతం బలమస్తు తేజః ॥

## అఖండమును వెలిగించుట

ఓం ఉద్దీప్యస్వ జాతవేదోపఘ్నన్నిర్ ఋతిం మమ ।
పశూన్శ్చ మహ్యామావహ జీవనం చ దిశో దిశ ॥

ఈ మంత్రముతో అఖండమును వెలిగించి గంధాక్షతలతో పూజించి నివేదన చెల్లించి తాంబూలము పెట్టి కర్పూరం వెలిగించి నమస్కరింపవలయును.

## బ్రహ్మకలశమ్

కలశమునకు గంధముపూసి బొట్టుపెట్టి కంకణం కట్టి అందు జలముగాని బియ్యమునుగాని ఉంచి అయిదు తమలపాకులు చుట్టూ ఉంచి వాటిమీద పసుపురాసి కుంకుమతో కల్యాణం బొట్టు పెట్టిన కొబ్బరికాయను పెట్టి దానిమీద రవికను ఉంచి పూలదండ వేయవలెను. పిమ్మట బ్రహ్మధ్యానం కొరకు కరన్యాస అంగన్యాసము చేయవలెను.

## శ్రీ వీరనారాయణ మంత్రం

ఓం అస్యశ్రీ వీరనారాయణ మహామంత్రస్య। పరబ్రహ్మ ఋషిః దేవీ గాయత్రీచందః। శ్రీ వీరనారాయణో దేవతా। హ్రాం బీజమ్। హ్రీం శక్తిః। హ్రూం కీలకమ్। శ్రీ వీరనారాయణ ప్రసాదసిద్ధ్యర్థే। ధర్మఅర్థ ఐశ్వర్య కామమోక్ష పంచవిధ పురుషార్థ సిద్ధ్యర్థే। జపే వినియోగః

## కరన్యాసమ్

శాం అంగుష్ఠాభ్యాం నమః ।

శీం తర్జనీభ్యాం నమః ।

శూం మధ్యమాభ్యాం నమః ।

శైం అనామికాభ్యాం నమః ।

శౌం కనిష్ఠికాభ్యాం నమః ।

శః కరతల కరపృష్ఠాభ్యాం నమః ।

## అంగన్యాసమ్

శాం హృదయాయ నమః ।

శీం శిరసే స్వాహా ।

శూం శిఖాయై వౌషట్ ।

శైం కవచాయ హుమ్ ।

శౌం నేత్రత్రయాయ వౌషట్ ।

శః అస్త్రాయ ఫట్ ।

ఓం భూర్భువస్సువరోమ్ ఇతి దిగ్బంధః ।

## బ్రహ్మంగారి ధ్యానమ్

శ్లో॥ వీరం వీరభయాది తత్త్వభరితమ్ వీరాసనస్థంగురు ।
వీరశ్రేష్ఠ వరించి వినుతం వీరాధివీరం హరిమ్ ।
వీరేంద్రం ఘనవీర వీరశుభదం వీరాధిమూర్త్యాధికమ్ ।
వీరాచార్య మహంభజామి సతతం శ్రీవీరనారాయణమ్ ॥

అని బ్రహ్మంగారిని ధ్యానింపవలయును.

## ప్రాణప్రతిష్ఠా మంత్రము

ఓం అసునీతే పునరస్మాసు చక్షుః పునః ప్రాణమిహానో దేహి భోగమ్। జ్యోక్ప శ్యేమ సూర్యముచ్చరన్త మనుమతే। మృళయాన స్వస్తి అమృతం వై ప్రాణా అమృతమాపః ప్రాణానేవ యథాస్థాన ముపహ్వాయతే॥

శ్రీ బ్రహ్మణే నమః ధ్యాయామి ఆవాహయామి ఆసనం సమర్పయామి। పాద్యం, అర్ఘ్యం, ఆచమనీయం సమర్పయామి। సుముఖో భవ। సుప్రసన్నో భవ। వరదోభవ। స్థిరాసనం కురు।

## బ్రహ్మాది పంచమూర్తుల ఆవాహనం

## బ్రహ్మ - సరస్వతీదేవీ ఆవాహనం

ఓం బ్రహ్మదేవానాం పదవీః కవీనా మృషి ర్విప్రాణాం మహిషో మృగాణాం శ్యేనో గృధ్రాణాగ్ం స్వధితిర్వనానాగ్ం సోమః పవిత్ర మత్యేతి రేభన్

ఓం ప్రాణోదేవీ సరస్వతీ వాజేభిర్వాజనీవతీ। దీనా మవిత్ర్యవత్।

సరస్వతీసహిత బ్రహ్మాణ మావాహయామి।

## విష్ణు - లక్ష్మీదేవీ ఆవాహనం

ఓం ఇదం విష్ణు ర్విచక్రమే। త్రేధా నిదధే పదమ్। సమూఢ మస్యపాగ్ం సురే।

ఓం సక్తుమివతితఉనాపునంతో యత్ర ధీరా మనసా వాచమక్రత। అత్రాసఖాయ సఖ్యానిజానతే భద్రైషాం లక్ష్మీర్ని హితాదివాచి।

లక్ష్మీదేవీ సహిత విష్ణుమావాహయామి।

## రుద్ర - పార్వతీదేవీ ఆవాహనం

ఓం కద్రుద్రాయ ప్రచేతసే। మీఢుష్టమాయ తవ్యసే। వోచేమ శంతమగ్ం హృదే।

ఓం గౌరీమిమాయ సలిలాని తక్షత్యేకపదీ ద్విపదీ సాచతుష్పదీ। అష్టాపదీ నవపదీ బభూవుషీ సహస్రాక్షరాపరమే వ్యోమన్।

పార్వతీదేవీ సహిత రుద్రమావాహయామి।

## ఇంద్ర - శచీదేవీ ఆవాహన

ఓం ఇంద్రం వో విస్వతస్పరి హవామహే జనేభ్యః। అస్మాక మస్తుకేవలః।

ఓం ఇంద్రాణీ మాసునారిషు। సుపత్నీ మహమశ్రవం। నహ్యస్యా అపరంచన జరసా మరతేపతిః।

శచీదేవీ సహిత ఇంద్రమావాహయామి।

## ఆదిత్య - సంజ్ఞాదేవీ ఆవాహనం

ఓం ఆసత్యేన రజసా వర్తమానో। నివేశయన్న మృతం మర్త్యంచ। హిరణ్యయేన సలితా రధేన। దేవోయాతి భువనాని పశ్యన్।

ఓం ఛందస్వతీ ఉషసా పేపిశానే సమానం యోని మనుసంచరన్తీ। సూర్యపత్నీ సంజ్ఞా విచరతః ప్రజాపతీ కేతుం కృణ్వాన్ అజరే భూరిరేజసా।

సంజ్ఞాదేవీ సహిత మాదిత్యమావాహయామి।

కలశమునకు చుట్టూ ఉన్న 5 ఆకులలో తూర్పు మొదలుగా పంచమూర్తులను పంచశక్తులను ఆవాహన చేయవలయును.

## గాయత్రీ విశ్వకర్మాదుల ఆవాహన

కలశమునకు చుట్టును గాయత్రీ విశ్వకర్మలను పంచ భూతములను పంచబ్రహ్మలను ఋషులను అష్టదిక్పాలురను ఆయా మంత్రములతో ఆవాహన చేయవలయును.

## షోడశోపచారములు

1. ఆపోహిష్ఠామయో భువః ఇతి ఉపచారికస్నానమ్।
2. క్షీర-దధి-ఘృత-మధు-ఫలోదక పంచామృతములతో ఆయా మంత్రములతో పంచామృత స్నానమ్।
3. ఆపోవా ఇదగ్ం సర్వం మంత్రముతో శుద్ధోదకస్నానమ్
4. అభివస్త్రా ఇతి వస్త్రాణి
5. శ్రీకరంచ పవిత్రంచ రోగశోక నివారకం। లోకేవశీకరం పుణ్యం భస్మ త్రైలోక్యపావనమ్॥ అని విభూతి
6. యజ్ఞోపవీతం పరమంపవిత్రం ఇతి యజ్ఞోపవీతమ్।
7. గంధద్వారాం దురాధర్షాం ఇతి గంధమ్
8. అర్చతప్రార్చత ఇతి తిలకమ్।
9. హరిద్రంచ మయానీతం ఇతి పసుపు ।
10. కుంకుమం శోభనం దివ్యం ఇతి కుంకుమ।
11. హిరణ్య హారకేయూర గ్రైవేయ మణికంకణైః। సుహారం భూషణై ర్యుక్తం। గృహాణపరమేశ్వర॥ ఇతి ఆభరణాని

12. మాలతీ మల్లికాదీని। నవాని కుసుమానిచ। ఏకనాధే ప్రయచ్ఛామి। మాలాం తాం ప్రతిగృహ్యతామ్। అని పుష్పమాల

13. సుగంధం శీతలం శుభ్రం। నానాగంధ సమన్వితమ్। ప్రీత్యర్థం తవ దేవేశ। త్వామద్య ప్రతిగృహ్యతామ్॥ అని పరిమళ ద్రవ్యమ్।

## ద్వాత్రింశన్నామ పూజ

1) ఓం వీరబ్రహ్మణే నమః
2) ఓం వీరాయ నమః
3) ఓం వీరాసనస్థాయ నమః
4) ఓం వీరాధివీరాయ నమః
5) ఓం వీరేంద్రాయ నమః
6) ఓం వేదవేద్యాయ నమః
7) ఓం వేదాంత వేద్యాయ నమః
8) ఓం వేదగోచారాయ నమః
9) ఓం వేదాగ్రగణ్యాయ నమః
10) ఓం వీరనారాయణాయ నమః
11) ఓం ఆదిమధ్యాంత రహితాయ నమః
12) ఓం సూర్యనారాయణాయ నమః
13) ఓం సర్వతీర్థగోచరాయ నమః
14) ఓం సర్వతత్త్వాయ నమః
15) ఓం సర్వవ్యాపినే నమః
16) ఓం పద్మనాభాయ నమః
17) ఓం పరమ పురుషాయ నమః
18) ఓం సర్వమయాయనమః
19) ఓం జ్యోతిర్మయాయ నమః
20) ఓం ఆనందస్వరూపాయ నమః
21) ఓం సర్వఫలప్రదాయ నమః
22) ఓం భేదరహితాయ నమః
23) ఓం కులమతవర్జితాయ నమః
24) ఓం ఆశ్రితరక్షకాయ నమః
25) ఓం గోవిందాంబావల్లభాయ నమః
26) ఓం భక్తసిద్ధ వత్సలాయ నమః
27) ఓం మహాగురవే నమః
28) ఓం కాలజ్ఞానబోధకాయ నమః
29) ఓం సర్వపూజితాయ నమః
30) ఓం రాజయోగినే నమః
31) ఓం శమాది గుణభూషణాయ నమః
32) ఓం జితేంద్రాయ నమః

ఈ ముప్పది రెండు నామములతో పూలతో పూజించవలయును.

15. ధూపం - వనస్పత్యుద్భవైర్దివ్యై... ।

16. దీపం - సాజ్యం త్రివర్తి సంయుక్తం... ।

17. సౌవర్ణస్థాలిమధ్యే మణిగణ స్థగితే గోఘృతాక్తాన్ సుపక్వాన్।

భక్ష్యాన్ భోజ్యాంశ్చ లేహ్యానపరిమితాన్ రసాన్ చోష్యమన్నం విధాయ।
నానాశాకై రుపేతం దధిమధుగుడక్షీర పానీయయుక్తమ్।
తాంబూలంచాపి దేవాః ప్రతిదినసమహం మనసాకల్పయామి॥
అని నైవేద్యమ్
గాయత్రీమంత్రముతో ప్రోక్షించి నివేదన చేయవలయును.

ఓం ప్రాణాయస్వాహా। ఓం అపానాయస్వాహా॥ ఓం వ్యానాయస్వాహా। ఓం ఉదానాయస్వాహా। ఓం సమానాయస్వాహా। మధ్యే మధ్యే పానీయం సమర్పయామి। అమృతాऽపిధానమసి ఉత్తరాపోశనం సమర్పయామి। హస్తౌ ప్రక్షాళయామి। పాదౌ ప్రక్షాళయామి। శుద్ధ ఆచమనీయం సమర్పయామి।

### తాంబూలమ్

18. పూగీఫలైస్స కర్పూరైః అని తాంబూలమ్।

19. హిరణ్యపాత్రం మధోః పూర్ణం దదాతి। అని కర్పూరమ్

20. ఓం తద్బ్రహ్మ ఓం తద్వాయుః ఇతి మంత్రపుష్పమ్

21. యానికానిచ పాపాని అని నమస్కారమ్।

22. అఖిల చరాచర - మంగళహారతి

23. తీర్థ ప్రసాదములు

## పూజకు ముందు అంకురార్పరణ చేయవలెను

## కళ్యాణవేదిక

రాత్రికి 7 గం॥ మొదలు శుభసమయములో అలంకరించిన కల్యాణమండపమందు పెండ్లిపీటల మీద కన్యాదాతలు, మధ్యలో బ్రహ్మంగారి ఉత్సవ విగ్రహంతో మంగళ వాద్యములతో ప్రాఙ్ముఖముగా కూర్చుండవలయును.

## కన్యావరణలు

శ్రీ వీరబ్రహ్మస్వామ్యర్థం కన్యాం వృణీధ్వమ్ అని అయిదుగురు వేదవేత్తలకు కన్యావరణలు ఇచ్చి నమస్కరించవలయును.

కన్యావరణలు తీసికొన్నవారు "వృణీమహే" అని వరణలు తీసికొని ఆశీర్వదింతురు.

## రాయబారులు

శివకోటయాచార్యులు వారి గృహమునకు వెళ్ళి పానకంతో మర్యాదలు పొంది బ్రహ్మంగారి సద్గుణములను మీ కుమార్తెయైన గుణవతి రూపవతి సదాచారవతియైన చి॥ల॥ సౌభాగ్యవతియగు గోవిందమ్మను శ్రీ స్వామివారికి ఇచ్చి వివాహము చేయవలసినదిగా కోరుదురు.

కన్యాదాతలు వారికి మర్యాదలు జరిపి అంగీకరించి పంపుదురు. రాయబారులు "కృతార్థాఃవయం" అని కృతకృత్యులై వెళ్ళి కన్యానిశ్చయమును చెప్పి ఆనందభరితులై వెళ్లుదురు.

## గౌరీపూజ

ఆలయంలో ప్రాగ్భాగమున గౌరీపూజకు అన్నియు సిద్ధముచేసి గోవిందమాంబా ఉత్సవవిగ్రహమును ఉంచి దీపారాధన చేసి,

గోవిందమాంబకు ప్రత్యామ్నాయముగా కన్యాదాతలు నూతన వస్త్రములు ధరించి పీటలమీద కూర్చుండి కంకణాలు ధరించి ముందు విస్తరిలో బియ్యం మీద పసుపు గౌరీదేవిని ఉంచి "కన్యాదానం గత్వేన గౌరీపూజాం కరిష్యే" అని సంకల్పం చేసి గోవిందమాంబ ఉత్సవ విగ్రహమునకు కంకణం కట్టి-

"శుభికే శిర ఆరోహ। శోభయన్తీ ముఖం మమ। ముఖగ్ం హిమమ శోభయ। భూయాగ్సంచ భగం కురు" అను మంత్రముతో బాషికమును కట్టి-

గౌరీదేవిని షోడశోపచారములతో పూజించి కర్పూరం వెలిగించి మంత్రపుష్పం పెట్టి నమస్కరింపవలయును. అందరికి తాంబూలములను ప్రసాదమును పానకమును ఇచ్చి విగ్రహమును వస్త్రములు ఇచ్చి ధరింపజేసి, పూజింపవలయును.

## గోవిందమాంబను కళ్యాణమండపమునకు తీసికొని వచ్చుట

మంగళవాద్యములతో స్వస్తివాచనములతో గోవిందమాంబను ముత్తైదువులు కళ్యాణవేదికకు తీసికొనివచ్చి తెరపట్టియుండగా పెండ్లిపీటమీద కూర్చుండబెట్టవలయును.

8. మయా సహ దశపూర్వేషాం దశాపరేషాం మద్వంశ్యానాం పిత్రూణాం సకలలోకాదుత్తీర్య శాశ్వత పర బ్రహ్మలోకే నివాస సిద్ధ్యర్థం లోకసంరక్షణార్థం మనుసూత్ర ప్రకారేణ సాలంకృత సహిరణ్యోదకేన కన్యాదానమహం కరిష్యే। అని మహాసంకల్పము చేయవలయును.

## కన్యాదాన సాక్షులు

శ్లో॥ విశ్వంభరా సర్వభూతా। స్సాక్షిణ్య సర్వదేవతాః।
కన్యా మిమాంప్రదాస్యామి। పిత్రూణాం తారణాయవై॥

శ్లో॥ కన్యాం సాలంకృతాం సాధ్వీం। సుశీలాయ సుధీమతే।
ప్రయతోఽహం ప్రయచ్ఛామి। ధర్మకామార్థసిద్ధయే॥

## శ్రీమాతా గోవింద మాంబా సమేత
## శ్రీ వీరబ్రహ్మేంద్రస్వామి వారి కళ్యాణ ప్రవర

శ్రీ వీరబ్రహ్మేన్ద్రస్వామి:- పంచాశత్కోటి యోజన విస్తీర్ణ భూమండల పర్యన్తం। సానగ సనాతనాది పంచ వింశత్యుత్తర శతబ్రహ్మర్షి గోత్రేభ్యః విశ్వబ్రాహ్మణేభ్యః శుభం భవతు॥

(యజు శ్శాఖాధ్యాయినే) ఉపసనాతన వామదేవ విశ్వచక్షు, ప్రతితక్ష, సునందన పంచార్షేయ ప్రవరాన్విత యజుశ్శాఖీ మయసూత్రః ఆపస్తత్త్వః మయబ్రహ్మద్రవిణః గ్రీష్మఋుతుః చతుష్కోణ కుండః అశ్వత్థ దణ్డః దారువృత్తిః విష్ణుమూర్తిః పంచదశస్తోమః సనాతన బ్రహ్మర్షి గోత్రోద్భవస్య విశ్వబ్రహ్మచార్యణో నప్త్రే।... మయ బ్రహ్మచార్యణః పౌత్రాయ।... వీరభోజయా చార్యణః దత్తపుత్రాయ। చతుర్దశ

భువనాధీశ్వరాయ్య। అఖిలాండకోటి బ్రహ్మాండనాయకాయ్య। తత్త్వాతీతాయ। సురాసుర నమస్కృత అఖిలలోకైక నాయకస్య। భూత భవిషద్వర్తమాన కాలజ్ఞాన విరచితాయ। మహరాజయోగ నిరతాయ। భస్మతిర్యక్ త్రిపుండ్ర రుద్రాక్ష కమండల యోగదణ్డ ధరాయ। సాక్షాన్మహా విష్ణు స్వరూపాయ - శ్రీ వీరబ్రహ్మేంద్ర స్వామినే వరాయ॥

శ్రీ గోవిందమాంబ:- పంచాశత్కోటి... శుభం భవతు॥

(ఋగ్శాఖాధ్యాయినే) ఉపసానగ బిభ్రాజ కశ్యప మను విశ్వకర్మా, విశ్వాత్మకమనుసూత్రః పృథివీతత్త్వః మనుబ్రహ్మద్రవిణః, అయోవృత్తిః, శివమూర్తిః, త్రివృత్సోమః సానగబ్రహ్మర్షి గోత్రోద్భవస్య... శ్రీయజ్ఞేశ్వరాచార్యణోనప్త్రీమ్।... శ్రీ మనుబ్రహ్మాచార్యణః పౌత్రీమ్।... శ్రీ శివకోటయాచార్యణః పుత్రీమ్। చతుర్దశ భువనాదీశ్వరీం। అఖిలాండకోటి బ్రహ్మాండనాయకీం। తత్త్వస్వరూపిణీం। సురాసుర నమస్కృతాఖిల లోకైక జననీం। సర్వాభరణ భూషితామ్। శ్రీ మహాలక్ష్మి స్వరూపిణీం। శ్రీ గోవిందమాంబా దేవీనామ్నీం కన్యామ్॥

## షోడశదానములు

కన్యాదానసాద్గుణ్యార్థం షోడశదానప్రత్యామ్నాయం దక్షిణాదానం తుభ్యమహం సంప్రదదే నమమ।

## మధుపర్క ప్రాశనం

కన్యాదానానికి పూర్వము అత్తగారు పెరుగు బెల్లం కలిపిపెట్టగా వరుడు తినవలయును. ఇందులకు మంత్రము-యన్మధునో మధవ్యం పరమ మన్నాద్యం వీర్యమ్ । తేనాఽహం హధునో మధవ్యేన పరమేణా న్నాద్యేన వీర్యేణ పరమోన్నాదో మధవ్యోసాని''.

## వరునిచే ప్రమాణము చేయించుట

"ధర్మే చ అర్థే చ కామే చ త్వయా ఏషా నాతిచరితవ్యా" అని కన్యాదాత కోరును. "నాతి చరామి" అని వరుడు ప్రమాణము చేయును.

## కన్యాస్వీకార మంత్రమ్

దేవస్య త్వా సవితుః ప్రసవే। అశ్వినోర్బాహు భ్యాం పూష్ణోహస్తాభ్యాం ప్రతిగృహ్ణామి। రాజాత్వావరుణో నియతు దేవీ దక్షిణే ప్రజాపతయే కన్యాం। తేనాఽ మృతత్వమస్యాం। వయోదాత్రే। మయో మహ్యామస్తు ప్రతిగ్రహీత్రే। క ఇదం కస్మా అదాత్। కామః కామాయ। కామోదాతా। కామః ప్రతిగ్రహీతా। కామగ్ం సముద్రమావిశ। కామేన త్వా ప్రతిగృహ్ణామి। కామైతత్తే। ఏషా తే కామదక్షిణా। ఉత్తానస్త్వాంగీరసః ప్రతిగృహ్ణాతు।

అని వరుడు కన్యాస్వీకార మంత్రమును చదువును.

## జీలకర్ర - బెల్లం

శాస్త్రసమ్మతముకాని ఆచారసమ్మతమైన బహుకాలము నుండి జతించిన బెల్లం జీలకర్ర ముద్దలను వధూవరులు పరస్పరము శిరస్సులమీద- "ధ్రువంతే రాజావరుణో ధ్రువందేవో బృహస్పతిః। ధ్రువంత ఇంద్రశ్చాఽగ్నిశ్చ రాష్ట్రం ధారయతాం ధ్రువమ్" అను మంత్రముతో పెట్టుకొనుచున్నారు. ఈ ఆచార ప్రకారము మాంగళ్య-ధారణకు ముందు బెల్లం జీలకర్ర ముద్దలను ఆకులలోనుంచి విగ్రహముల ముందు ఉంచవలయును.

## తెరను తీయవలయును

తెరను తీసిన తరువాత వరుడు "అభ్రాతృఘ్నీం వరుణాపతిఘ్నీం బృహస్పతే ఇంద్రా పుత్రఘ్నీం లక్ష్మంతామస్యై సవితస్సువః" ఈ మంత్రముతో వధువును చూడవలయును.

## రెండవసారి కన్యను చూచుట

"అఘోర చక్షు రపతిఘ్న్యేధి శివాపతిభ్య స్సుమనా స్సువర్చాః। జీవసూర్దేవ కామా స్యోనా శంనో భవద్విపదే శం చతుష్పదే" ఈ మంత్రముతో రెండవసారి కన్యను చూడవలయును.

## వధూవరుల సంకల్పమ్

"ఆవాభ్యాం కర్మాణి కర్తవ్యాని, ప్రజాశ్చ ఉత్పాదయితవ్యాః" అని వధూవరులు సంకల్పము చేయుదురు.

## కన్య యొక్క సీమాంతరేఖను దర్భతో తుడుచుట

వరుడు జలపాత్రను తీసికొని లేచి దర్భకొసను అంగుష్ఠ అనామిక వ్రేళ్ళతో పట్టుకొని వధువు యొక్క కనుబొమల మధ్యగా "ఇద మహం యా త్వయి పతిఘ్ని అలక్ష్మీస్తాం నిర్దిశామి" ఈ మంత్రముతో తుడిచి దర్భను వెనుకవైపున విడిచి పెట్టవలయును.

## అపశకునము జరిగిన చదువు మంత్రము

మంత్రం- "జీవాగ్ం రుదన్తి విమయన్తే అధ్వరేదీర్ఘామను ప్రసితిం దీధియు ర్నరః। వామం పితృభ్యో య ఇదగ్ం సమేరిరే। మయః పతిభ్యో జనయః పరిష్వజే।"

## కన్య శిరస్సున దర్భచుట్టను ఉంచి ప్రోక్షించుట

"హిరణ్యవర్ణాః శుచయః పావకాః" ఇత్యాది 5 మంత్రములతో వధువు శిరస్సుమీద ఉంచిన దర్భచుట్ట మధ్యలో వరుడులేచి ఎడమచేతితో జలపాత్రను పట్టుకొని బంగారు ఉంగరముగల దర్భతో 5 సార్లు ఉదకమును ఉంచవలయును.

## కన్యకు తలంబ్రాల చీరె ఇచ్చుట

తలంబ్రాల చీరె, రవిక, వల్లెవాటు పంచ, పసుపు, కుంకుమ, పూలు, పండ్లు మేనమామలు ఇవ్వగా తీసికొని నమస్కరించినప్పుడు ఆశీర్వదింతురు.

మంత్రం:- "సుమంగలీరియం వధూరిమాగ్ం సమేత పశ్యత। సౌభాగ్యమస్యై దత్వా యాధాస్తం విపరేతన" ఈ మంత్రముతో దాతల పేర్లు చెప్పి ఇవ్వవలయును. వాటిని ధరించి వధువు పీటమీద కూర్చుండవలయును. మరియొక మంత్రం - "పరిత్వా గిర్వణోగిర ఇమా భవన్తు విశ్వతః। వృద్ధాయు మనువృద్ధయో జుష్టా భవన్తు జుష్టయః।

## మాంగల్యమును తెచ్చుట

మంగళవాద్యములతో పూజాద్రవ్యములతో బయలుదేరి విశ్వబ్రహ్మ ఆచార్యులవారింటికి వెళ్ళి వారికి మర్యాదలు జరిపి వారు పూజించి యిచ్చిన మాంగల్యము చుట్లు పళ్ళెరములో పెట్టుకొని తమలపాకుతో కప్పి ముత్తైదువులు మంగళవాద్యములతో తీసికొని రావలయును.

## మాంగల్యమును పూజించుట

రెండు పళ్ళెరములలో తలంబ్రాలు బియ్యం పోసి మధ్య ఆకులో మాంగల్యములను ఉంచి పసుపు, కుంకుమ, పూలు, ఎండు కొబ్బరి చిప్పలు రవికలు తాంబూలములను ఉంచి ముత్తైదువులు తీసికొని వచ్చి వధూవరుల ముందు ఉంచవలయును.

వధూవరులు ఆచమనంచేసి "అభ్యుదయ ముహూర్తే ధర్మప్రజా సంపత్యర్థం శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం శిశు పశుధన ధాన్య సౌభాగ్య సిద్ధ్యర్థం పరమాత్మా స్వరూప వివాహ ప్రధానాంగ భూతస్య పరమ పవిత్ర మాంగల్యధారణం కరిష్యే" అని సంకల్పం చేసి షోడశోప చారములతో పూజించి కర్పూరం వెలిగించి నమస్కరింపవలయును.

## మాంగల్యములను పెద్దలచే తాకించుట

పురోహిత బ్రహ్మపూజించిన మాంగల్యములను తీసుకొని ఆశీర్వాద మంత్రములతో పెద్దలైన స్త్రీ పురుషులందరికి తాకించుచు అక్షతలనిచ్చి వచ్చి ఆవుపాలను అద్ది కుంకుమ అద్ది వరునకు ఇవ్వవలయును.

## సుముహూర్తమునకు వరుడు తన మాంగల్యమును ముందుగా వధువునకు ధరింపజేయుట

వరుడు మంగళ సూత్రమును పట్టుకొని లేచి "ఆశాసానా సౌమనసం ప్రజాగ్ం సౌభాగ్యం తనూం। అగ్నే రనువ్రతా భూత్వా సన్నహ్యే సుకృతాయకమ్।" ఈ మంత్రముతో వధువు కంఠమున ధరింపజేసి మూడుముళ్ళు వేసి వాటిమీద ముమ్మారు కుంకుమ అద్ది శిరస్సు మీద అక్షతలనుంచి ఆశీర్వదించి,

మరల రెండవ మాంగల్యమును గూడ పై విధముగా ధరింపజేయ వలయును. అందరు పసుపు అక్షతలను ఉంచి ఆశీర్వదింతురు.

## తలంబ్రాలు పోసికొనుట

వరుడు ఆవుపాలతో వధువు దోసిలిని తుడిచి కొబ్బరి చిప్పతో ముమ్మారు తలంబ్రాలను వుంచవల్లయును. తరువాత పురోహిత బ్రహ్మ వరుని దోసిలిని పాలతో తుడిచి ముమ్మారు తలంబ్రాలను ఉంచవలయును.

తరువాత వధువు దోసిలిమీద వరుని దోసిలి వుంచవలయును. పైన కుంకుమ చల్లి క్షీరపాత్రను ఉంచవలయును.

## తలంబ్రాల మంత్రము

బహుధేయం చాస్తు। పుష్టిరస్తు। తుష్టిరస్తు పుణ్యాంవర్ధతాం శాంతిరస్తు। వృద్ధిరస్తు। అవిఘ్నమస్తు। ఆయుష్యమస్తు। ఆరోగ్యమస్తు। స్వస్తిశివంకర్మాஉస్తు। కర్మసమృద్ధిరస్తు। ధనధాన్య సమృద్ధిరస్తు। త్వష్టు ప్రజాపతిః ప్రియతామ్। దంపత్యోః సర్వేగ్రహాః శుభై కాదశ స్థానఫలదాః వరదాః సుప్రసన్నాః భవన్తు।

మంత్రం-ఓం ప్రజాపతి స్త్రియాం యశః ముష్కయో రదధాత్సపం। కామస్య తృప్తిమానందం। తస్యాగ్నే భాజయే హమా।

మోదః ప్రమోద ఆనందః। ముష్కయో ర్నిహిత స్సపః। సృత్వేవ కామస్య తృప్యాణి। దక్షిణానాం ప్రతిగ్రహే।

మనసశ్చిత్త మాకూతిం। వాచస్సత్యమశీమహి। పశూనాగ్ం రూప మన్నస్య। యశ శ్శీ శ్రయతాం మయి।

యథాహ మస్యా అతృపద్గ్స్త్రియై పుమాన్। యథాస్త్రీ తృప్యతి పుగ్ంసి ప్రియే ప్రియా। ఏవం భగస్య తృప్యాణీ। యజ్ఞస్య కామ్యః ప్రియః।

దదామీ త్యగ్నిర్వదతి। తథేతివాయు రాహతత్। హన్తేతి సత్యం చంద్రమాః ఆదిత్య స్సత్యమోమితి।

ఆపస్తత్సత్య మాభరన్। యశో యజ్ఞస్య దక్షిణామ్।

ప్రజా మే కామ స్సమృద్ధ్యతామ్ అని పరస్పరము తలంబ్రాలను శిరస్సులమీద పోసుకొనవలయును.

రెండవసారి పై మంత్రమును పరీక్షించిన తరువాత "యజ్ఞో మే కామస్సమృద్ధ్యతామ్" అనవలయును రెండవసారి వధువు దోసిలిపైన ఉండవలయును. మూడవసారి వరుని దోసిలి పైనుండవలయును. మూడవసారి "పశవోమే కామః సమృద్ధ్యతామ్।" అని వరుడు పలుకవలయును.

## తలంబ్రాలు పోసికొన్న తరువాత వరుడు వధువు మెడలో పూలదండ వేయవలయును

రెండవసారి వధువు పూలదండను పట్టుకొని లేచి వరుని మెడలోవేసి నమస్కరించవలయును. వరుడు ఆశీర్వదించును.

వరుడు లేచి కుడివైపున కూర్చుండవలయును. ముత్తైదువులు రెండు పళ్ళెరములలోని వెండి జ్యోతులను పాటలుపాడి వధూవరుల కళ్ళకు ముమ్మారు అద్ది ఆశీర్వదింతురు.

## విగ్రహములను ప్రాఙ్ముఖముగా నుంచుట

బ్రహ్మంగారి గోవిందమాంబగారి విగ్రహములను కళ్యాణవేదిక మీద ప్రాఙ్ముఖముగా నుంచవలయును.

## బ్రహ్మముడి వేయుట

మంత్రము - "అగ్నే విశ్వేభిస్సనేక దేవైరోర్ణావంతం ప్రధమ స్సీదయోనిం। కులాయనం ఘృతవంతగ్ం సవిత్రే యజ్ఞన్నయ యజమానాయసాధు" ఈ మంత్రముతో పురోహితబ్రహ్మ వధూవరులు ధరించిన వస్త్రములు యొక్క చెరగులకు ఆకులు వక్కలు ఖర్జూరపండ్లు కానుకలతో తాంబూలములను కట్టి ఆశీర్వదింపవలయును.

## వధువుకు అత్తగారిచ్చు వస్త్రములను, ఆభరణములను చదివించవలయును

వధువు లేచి అత్తమామలకు నమస్కరింపగా ఆశీర్వదింతురు.

## మంగళాష్టకములు చదువుట

1. శ్రీమద్భి ర్ధివిషద్భి రర్చిత పదద్వం ద్వైకవిభ్రాజితః। స్వోత్పన్న ప్రతిభా ప్రపంచఘటా నాదీక్షా గుమాణాం గురుః
లోకానాం శుభశోదన వ్యవసితోయో విశ్వకర్మా ప్రభుః।
దంపత్యోరనయోః ప్రభావిభయోః కుర్యాత్సవై మంగళమ్॥

2. సద్యోజాతముఖే ప్రపంచ ఘటకా దృగ్భిర్వచోరాజభిః।
సాక్షాత్కృత్య జగత్త్రయావనకళా దక్షోభవద్వ్యోమనుః।
ఉద్దీప్య చ్ఛివమూర్తి రచ్చసృజనా వ్యగ్రాంతరంగాయతో।
దంపత్యోరనయోః ప్రభావిభయోః కుర్యాత్సవై మంగళమ్॥

3. ప్రాదుర్భూయ యజుర్భి రిద్ధ కరణాత్తద్వామ దేవాననాత్।
విష్ణోర్మూర్తి మవాప్య విశ్వకలనా విద్యావచోలంకృతః
యోదేవాసుర పూజితాంఘ్రియుగళో వేధామయోధీమయః।
దంపత్యో రనయోః ప్రభావిభవయోః కుర్యాత్సవై మంగళమ్॥

4. దివ్యాఘోరముఖాచ్చ సామవచసా ప్రావిర్భకోஉ భూన్మహాన్।
రూపాణ్యా జగతో బహూని ఘటయన్ బ్రహ్మాకృతి శ్రీకృతః।
యోదేత్తా నిక్షిలక్రియా ప్రకరణేత్వష్టా ప్రజానాంపతిః।
దంపత్యోరనయోః ప్రభావిభవయోః కుర్యాత్సవై మంగళమ్॥

5. రాజత్తత్పురుషా దథర్వవచసా సంభూయ తేజోభరః।
విశ్వోత్పత్తి ముపాచరన్ మఘవతో మూర్తిం సదాధారయన్।
యోవిభ్రాజతి శిల్పకార్యకలనా చ్ఛిల్పి ప్రజానాయకో।
దంపత్యోరనయోః ప్రభావిభవయోః కుర్యాత్సవై మంగళమ్॥

6. ఈశానానన పంకజా త్ప్రణవత స్సౌవర్ణ తేజోద్భవః।
భాస్వన్మూర్తి మపారసృష్టి కలనాం సంప్రాప్తవా నుద్ధరః।

యోలోకోత్తర భూషణో విజయతే విశ్వజ్ఞ ధాత్ర్యుత్తమపి।

దంపత్యోరనయోః ప్రభావిభవయోః కుర్యాత్సవై మంగళమ్॥

7. ఔద్ధత్యం పరిబాధనం సమధికం యస్యాఉ భవచ్ఛత్రుభిః।

దత్వా తస్యమఘోన ఏవ కవచం దివ్యంలసన్మంత్రతః।

ఆచార్యత్వ మవాప్యయో విజయతే శ్రీ విశ్వరూపోమహాన్।

దంపత్యోరనయోః ప్రభావిభవయోః కుర్యాత్సవై మంగళమ్॥

8. భూత్వాదివ్యవ పుష్కతః ప్రవిమల బ్రహ్మోన్వవాయే భవాః।

విజ్ఞానేన మహత్త రేణ ఋషితాం సం ప్రాప్నువంతో భృశమ్।

ఆదిత్యాంస ఏవ దీప్త ఋభవో లోకోవ సృష్టిక్రియాః।

దంపత్యోరనయోః ప్రభావిభవయోః కుర్యాత్సవై మంగళమ్।

ఈ ఎనిమిది మంగళాష్టకములను చదివి వధూవరులను దీవించవలయును.

## పండిత ఆశీర్వచనమ్

సంవత్సర అయన ఋతు మాస పక్ష తిధి వార నక్షత్ర యోగ కరణ లగ్న హోరా ద్రేక్కాణ ద్వాదశాంశ త్రింశాంశాశ్చ నిరంతర మనుకూలా శ్శుభాస్సర్వే గ్రహాః శుభై కాదశస్థాన ఫలదా వరదా స్స్వప్రసన్నా సుముహూర్తా భవన్తు। స్వస్తి సన్మంగళాని భవన్తు। సమస్త సన్మంగళాని భవన్తు। అని పండితులు ఆశీర్వదింపవలయును.

## నల్లపూసలు

పళ్ళెరములోని బియ్యం మీద తమలపాకు ప్రాఙ్ముఖముగా వేసి దానిమీద నల్లపూసలు (లక్ష్మీరూపుగల) ఉంచి వరుడు "నీలలోహిత ధారణం కరిష్యే" అని సంకల్పముచేసి, షోడశోపచారములతో పూజించి పూజా ప్రసాదమును స్వీకరించి,

పురోహిత బ్రహ్మ పెద్దల హస్తస్పర్శ చేయించి తెచ్చి యివ్వగా మంగళ వాద్యములతో "నీలలోహితే భవతఃకృత్యా సక్తి ర్వ్యజ్యతే। ఏధం తేఽస్యా జ్ఞాతయః పతిర్బంధేషు బధ్యతే॥" ఈ మంత్రముతో వధువు మెడకు నల్లపూసలుకట్టి మూడు ముడులు వేసి కుంకుమ ఉంచి ఆశీర్వదించి కూర్చున్నపుడు అందరు అక్షతలుంచి ఆశీర్వదింతురు.

తరువాత వధువుయొక్క కాలి వ్రేళ్ళకు, తల్లిగాని అత్తగారుకాని మెట్టెలు పెట్టి ఆశీర్వదింతురు.

## చదివింపులు

వీరబ్రహ్మేంద్ర స్వామివారి కళ్యాణ మహోత్సవమునకు భక్తులు సమర్పించిన కానుకలను మాత్రము - "హిరణ్యరూపస్స హిరణ్య సందృగ పాన్నపాచ్చేదు హిరణ్య వర్ణః। హిరణ్యయాత్పర్యోనేర్నిషద్య హిరణ్యాదాద దత్యన్నమస్మై" ఈ మంత్రముతో పురోహిత బ్రహ్మ అందజేయవలయును. పండితులు మహదాశీర్వాదము చేతురు. నివేదనలు చెల్లింతురు.

## కమ్మకడియం

వసంతపాత్రను వధూవరుల ముందుపెట్టుదురు. అందులో పురోహిత బ్రహ్మ బంగారు పావు వెండి పావు వధూవరులు చూచుచుండగా వేసి- "దేవేంద్రాణి నమస్తుభ్యం। దేవేంద్ర ప్రియభామిని। వివాహ భాగ్యమారోగ్యం। పుత్రలాభంచ దేహిమ్" అని చదువుచుండగా వధూవరులు ఒకేసారి పాత్రలోని పావులను తీయుదురు. బంగారు పావుతీసినవారిని విజయం పొందిన వారిగా ప్రకటించును.

మంగళహారతి ఇచ్చిన తరువాత తీర్థప్రసాదములు అందరు స్వీకరింతురు.

## త్రయాహ్నిక పక్షమున

కళ్యాణదినమునకు క్రిందటి దినమందు రాత్రికి కలశస్థాపన - అంకురార్పణ- నందిపటము ఆవిష్కరణ చేయవలయును.

మూడవదినమందు ఉదయం పూజాహోమములు పూర్ణాహుతి- రాత్రికి రధోత్సవము జరుపవలయును.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

బ్రహ్మంగారి కళ్యాణం సమాప్తమ్

# మంగళహారతి

1. అఖిల చరాచరమంతయు నీవగుచును సకలరూపుల తోడ సంచరించి అకలంకమగు దశయవతారములు దాల్చి సకల లోకములేలు సద్గురుస్వామి మంగళం మంగళం వీరబ్రహ్మ మంగళమ్॥

2. వీరప్పయ్యను పేర జేరి బనగానిపల్లె కారణమూర్తివై ఘనతతోడ గరిమిరెడ్డచ్చమ్మగారిని మన్నించి కోరి యన్నాజియ్య కోర్కెదీర్చిన స్వామి - మంగళం ॥

3. త్రైలికాగత సకల ధర్మములను శ్రీ కాలజ్ఞానమున వాకొనియు ప్రాకటముగ భక్తానీకము బ్రోచిన సాకార బ్రహ్మ శ్రీ సద్గురు దేవా - మంగళం॥

4. అల్లాడు పల్లెలో హరి పోతులూరయ్య వల్ల పరిపూర్ణము కొల్లాలాడి కల్లకలి దోషములెల్ల దూరముచేసి కలికివౌ కందిమల్లయ పురనివాసా - మంగళం॥

5. గోవిందమాంబను కోరికతో వరియించి నీవు సంసారాన నిలిచితివి - దేవదేవతలకు దేవుడవగుచు భావింపగ వీర బ్రహ్మమౌ నీకు - మంగళం॥

6. బాలసిద్ధుని బ్రోచి భావంబుబ్రోచి అమనస్కయోగము నందజేసి నమ్మినవారిని సముద్రమున బ్రోచి నిండు సమాధిలో నిలచిన దేవా - మంగళం మంగళం॥

సద్గురు దేవా మంగళమ్.

## బ్రహ్మం గారి కళ్యాణమునకు కావలసిన పూజాద్రవ్యములు

| | |
|---|---|
| మామిడిమండలు | ఉత్తరీయం |
| పసుపు | పంచామృతములు |
| కుంకుమ | విభూతి |
| అగర్భత్తీలు | వస్త్రములు |
| కర్పూరం | పొంగలి |
| ఖర్జూర పండ్లు | బాసికములు |
| తమలపాకులు | తెరచల్ల |
| అరటిపండ్లు | కాళ్ళుకడుగు పళ్ళెము |
| వక్కలు | కొబ్బరి బొండం |
| పీటలు | హిరణ్యం |
| ముగ్గుపిండి | పెరుగు, బెల్లం |
| కుందులు | జీరా, బెల్లం |
| నూనె, వత్తులు | తలంబ్రాలు చీర, రవిక, |
| బియ్యం | వల్లెవాటుపంచ |
| ముూకుళ్ళు | మాంగల్యము |
| పీటలు | తలంబ్రాలు బియ్యం |
| కలశం | ఎండుకొబ్బరి చిప్పలు |
| గంధం | ఆవుపాలు |
| యజ్ఞోపవీతములు | చిల్లర |
| పూలు, పూలదండలు | పూలదండలు |
| ఆచమనపాత్ర, ఉద్ధరిణ | పిండిజ్యోతులు |
| కొబ్బరి కాయలు | నల్లపూసలు |
| రవికలు | మెట్టెలు |

## కన్యాస్వీకర్తలు

కన్యాస్వీకర్తలు పశ్చిమ ముఖముగా పీటలమీద కూర్చుండి స్వామివారి ఉత్సవ విగ్రహమునకు బాషికం కట్టవలయును.

## కన్యాదానం

శ్రీ వీరబ్రహ్మస్వామినే నమః ఇదమాసదం అని అక్షతలు ముందు ఆకులో నుంచవలయును. ఇదం పాద్యం అని పలికి కాళ్లు కడుగు పళ్ళెము మధ్యలో నుంచి కన్యాదాత భార్య ఉదకము పోయుచుండగా-

## పాద ప్రక్షాళన

శ్లో॥ నమో స్త్వనంతాయ సహస్రమూర్తయే ।
సహస్రపాదాక్షి శిరోరుబాహవే ।
సహస్రనామ్నే పురుషాయశాశ్వతే ।
సహస్రకోటీ యుగధారిణే నమః ॥

ఈ మంత్రముతో బ్రహ్మపాదుకలను కడిగి ఆ ఉదకమును శిరమున ప్రోక్షించుకొనవలయును. గంధపుష్పాదులతో పూజించి-

## పెండ్లిబట్టలు

యువం వస్త్రాణిపీవసా వసా। ధేయువో రచ్ఛిద్రా మంతవోహ సర్గాః। అవాతరతి మమృతాని విశ్వాబుతేన మిత్రా వరుణా సచేధే। ఈ మంత్రముతో కన్యాదాతలిచ్చిన పెండ్లి బట్టలను సమర్పింప వలయును. నమస్కరింపవలయును. కన్యకు బదులుగా కన్యాదాతలు చేతులలో కొబ్బరి బొండమును హిరణ్యమును ఉంచుకొని పురోహిత బ్రహ్మ జలము పోయుచుండగా -